శ్రీ

# వేణుగోపాలకృష్ణ శతకము.

(తిన్నెలపూడి)



గ్రంథకర్త:

జూటూరు లక్ష్మీనరసింహయ్య,

వాకాడు గ్రామము.

1931.

 [వెల రు. 0—2—0.]

# శ్రీ వేణుగోపాల కృష్ణశతకము

(తిన్నెలపూ[redacted]



గ్రంథకర్త:

జూటూరు లక్ష్మీనరసింహయ్య,

వాకాడు గ్రామము.

1931.



[వెల రు. 0—2—0.

# విజ్ఞప్తి.

పండిత, పాఠక, మహాశయులారా !

శ్రీమత్కూడలి గ్రామసమీప పూర్వభాగంబున వేదికాపురమను నామాంతరంబుఁగల తిన్నలపూడి గ్రామంబున భక్తి, విద్యా, వినయ, సౌశీల్య, సుహృద్భావ, గౌరవాదులకెల్ల నెల్లయగు మ॥రా॥రా॥శ్రీ కోటమరెడ్డి చెంచురాఘవరెడ్డిగారు శ్రీవేణుగోపాల కృష్ణమందిరముం గట్టించి శ్రీవారికి సర్వకైంకర్యంబుల జరిపించుచుండుట నే గతసంవత్సర కల్యాణోత్సవంబున కాహూయమానుండనై పోయి తదుత్సవవిభవంబుం దిలకించుచుండ నాదేవుని యనుగ్రహంబున "వేణుగోపాలుఁడుకృష్ణమూర్తి మముఁబాలనసేయు దయాంతరంగుఁడై" యను మకుటంబున సీశతకప్రథమంబునంగల రెండు పద్యంబులాశువుగఁదోఁచుటంజేసి వానింజదివి యానందించుచుండ నా చెంతనుండి శ్రీరెడ్డిగారును వానినివిని సంతసించి యీమకుటంబున నొక శతకంబునువ్రాయ నన్నుం బ్రోత్సహించిరి కాని కించిజ్జ్ఞుఁడనగు నేనెక్కడ ? ఏక (ల) కారప్రాస శతకమంతయు వ్రాయుటెక్కడ ? వ్రాసి దోషైకదృక్కుల బారినుండి తప్పించుకొనుటెక్కడ ? యని నిరుత్సాహుఁడనై యుండి తుదకు శ్రీవేణుగోపాలానుగ్రహంబును పండితవర్యుల సత్కరుణయు

రెడ్డిగారి ప్రోత్సాహంబు మాత్రఁగాఁగాని వ్రాయ సాహ
సించి యెట్లో యీశతకమును బూర్తిచేసి యిందుఁగల లోప
ముల సవరించుటకై నాయుడిపేట వాస్తవ్యులు నుభయభాషా
పాండితీధురీణులు, శ్రీసోమశేఖరేశ్వరీయాద్యనేక గ్రంథకర్తలు
నగు బ్రహ్మశ్రీ ఉత్పల నరసింహశాస్త్రిగారినిఁ బ్రార్థింప, వా
రును వారిసోదరులగు శ్రీకృష్ణశాస్త్రిగారును నాయందు శిష్య
వాత్సల్యముంచి కొలదిపద్యములమాత్రము సవరించి మఱి
యొకసారివచ్చిన తక్కినవి సవరించెదమని సెలవొసంగిరిగాని
కారణాంతరంబుల వారిని మరల సందర్శించు భాగ్య మబ్బ
దయ్యె. ఇంతలో గూడూరు హైస్కూలు ప్రధానాంధ్ర పండి
తులును, సదయహృదయులు నుభయభాషా వేద వేదాంతాది
విదులును, లక్ష్మీకటాక్షాద్యనేక గ్రంథకర్తలునగు బ్రహ్మశ్రీ
ఉ. వే. కాండూరు కృష్ణమాచార్యులవారి దర్శనభాగ్య మబ్బి
నందులకు సంతసించి వారిం బ్రార్థింప శ్రీవారు శ్రమించి వీలు
కొలది దీనినామూలాగ్రము సవరించి యచ్చొత్తింప నాజ్ఞనొ
సంగిరి. మరియు నేనీశతకమును రచించుకాలంబున నా మిత్రులు
నుత్తరదేశీయులునగు మ॥రా॥శ్రీ పయిడిపాటి సుబ్బయ్యగా
రక్కడక్కడఁ గొన్నిసలహాల నొసంగి సాయమొనర్చిరి గాన
పైవారి కందరికినేఁ గృతజ్ఞతాపూర్వకానేక నమస్కారంబు
లర్పించుచున్నవాఁడ.- ఇంతియగాక నీశతకమున ప్రాసనియమ
మొక్కటియగాక పద్యమున సరాసరి మూడవవంతు మకుట

మే సరిపోయి తక్కిన భాగమునసే భావమంతయు ముగింప వలసివచ్చినందున శబ్దములు పౌనః పున్యములైనందులకును, నేదేని పొరబాటునగల లక్షణ, వ్యాకరణ, సమాస, సమన్వయాచితీ భంగాది, లోపంబులకును బండితులు కోపింపక క్షమించి తప్పులు నాకుఁదెల్పుదురని మిగులఁ బ్రార్థింపుచున్నవాఁడ. మఱియు నన్నుం బ్రోత్సహించి వ్రాయించి దీనిని ముద్రింపించుటకగు ద్రవ్యమొసంగిన శ్రీ రెడ్డిగారిని శ్రీ వేణుగోపాలకృష్ణమూర్తి సర్వశ్రేయములనొసంగి సదా రక్షించుగాత.

ఇట్లు బుధ విధేయుఁడు.

తే 2—5—1931 ది. జూటూరు లక్ష్మీనరసింహయ్య.



## బ్రహ్మశ్రీ ఉ॥ వే॥ కాండూర్ కృష్ణమాచార్యులుగారి అభిప్రాయము.

శ్రీమత్ బ్రహ్మశ్రీ జూటూరు లక్ష్మీనరసింహయ్యగారు భక్తిపూర్వకముగ విరచించిన (తిన్నలపూడి) శ్రీవేణుగోపాల కృష్ణశతకమును ఆమూలాగ్రము వింటిని. అందు మొదటఁ గొంతభాగము స్తోత్రరూపముగను, దక్కినభాగము శ్రీభాగవత కథలను బోధించునదిగను నున్నది. కవిత్వము సాధారణశైలితో నెల్లరకుఁ దెలియునటుల రమ్యముగ నున్నది. శతకమంతయు నేక (ల) ప్రాసతో ముగించవలసియుండుటచే వాడినపదముల వాడుటయు మకుటమే చాలఁబెద్దదైనందునఁ గొన్నిపద్యముల నెక్కుడు భావముల నిముడ్చుటకు వలనుపడలేదనియుఁ దోఁచెడు. కాని మొత్తముమీఁద కొన్నిపద్యముల భావములు కడుంగడు శ్రవణానందములై యున్నవి. రసజ్ఞులగు పాఠకమహాశయులాదరించి ఈకవిగారినిఁ బ్రోత్సహించు మనకుఁ దల్లియగు నాంధ్ర భాషామతల్లికి నుల్లాసముఁ గలిగింతురుగాక యని యాదేవదేవునిఁ బ్రార్థించుచున్నాను.

ఇట్లు,

కాండూర్ కృష్ణమాచార్యులు,

ప్రధానాంధ్ర పండితులు,

బోర్డు హైస్కూలు,

తే 16—3—1931 ది గూడూరు, (నెల్లూరు జిల్లా.)



# శ్రీ వేణుగోపాల కృష్ణ శతకము



ఉ॥ శ్రీలలనామనోహరుఁడు ♦ సేవకనేత్ర చకోరచంద్రుఁడా
పాలితసర్వలోకుఁ డఘ ♦ పంక్తి విభేదకుఁడాశ్రితాళికిన్
శ్రీలనొసంగువాఁడు, శుభ♦శీలుఁడు తిన్నలపూడి వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై

ఉ॥ శ్రీలలనాకళత్రుఁడత ♦ సీసుమ గాత్రుఁడుఁ బద్మనేత్రుఁడా
కాలనిశాత పాశలతి ♦ కాళిలవిత్రుఁడు నందపుత్రుఁ డు
ద్వేలవినోదపాత్రుఁడరి ♦ భీకరసూత్రుఁడు బాల వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై.

ఉ॥ కాలునిఁబారఁదోలఁగల♦కాలముఁదచ్ఛుభ పాదపద్మముల్
లోలతఁగొల్చు భక్తిరస ♦ లోలమనస్కుల నెల్లవారలన్
బాలనసేయువాఁడు సమ♦భావుఁడుసుందరమూర్తి వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై.

ఉ॥ నీలపయోదకాంతి కమ ♦ నీయమనోహరమూర్తి సద్యశో
జాలవిశాలవర్తి సుర ♦ చారణ కిన్నర గేయకీర్తి గో
పాలకచక్రవర్తి పరి ♦ భంజిత భక్తజనార్తి వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై.

ఉ॥ బాలుఁడు చిన్నికృష్ణుఁడు శు♦భంకరుఁడంచితబర్హిబర్హ సం
కీలితమౌళి దివ్యముని ♦ గేయమహామహిమోన్నతుండు నీ
లాలకశోభితానన సు♦ధాంశుఁడు పావనమూర్తి వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై.

ఉ॥ ఆలనుమేపుపాపఁడు ద♦యాన్వితుఁడాఢ్యుఁడు నందసుందరీ
లాలితుఁడవ్యయుండు కమ♦లాహృదయాంబుజవర్తి గోపికా
లోలుఁడు సర్వశాస్త్రకుశ♦లుండు శరణ్యవిభుండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై.

ఉ॥ కాలగళార్చితుండు శితి ♦ కంఠశరాసనభంజనుండు శం
పాలతికాభచేలుఁడు సు ♦ పర్ణవిహారుఁడు గోత్రధారి ప
ద్మాలలనామనోహరుఁ డు♦దారకథావినుతుండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై.

ఉ॥ కేలఁగుఠారము౦చి నృప ♦ కేసరివర్గము నిర్వదొక్క మా
రాలమునందుఁగూలిచి త ♦ దస్రమునం బితృతర్పణంబులొ
గ్రాలఁగఁజేసినట్టి భృగు ♦ రాముఁడు క్షత్రియవైరి వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 24

ఉ॥ భూలలనాత్మజాత సతి ♦ పూతకథామృత సీతఁగొంచు న
య్యాలరి రావణుండు చన ♦ నాతనిఁగేళనహాయుఁడై యతం
డ్రాళితఁగూల్చినట్టి రఘు ♦ రాముఁడు తారకమూర్తి వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 25

ఉ॥ తాలము నీలచేల మతి ♦ దారుణమౌ ముసలంబుఁగల్గి న
త్ప్రాలస దుష్టశిక్షల న ♦ వారణసల్పుచుఁ బాపదూరుఁడై
క్రాలినదివ్యమూర్తి బల ♦ రామసమాఖ్యుఁడు నైన వేణుగో
పాలుఁగు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 26

ఉ॥ చాలఁగ బాధలం బొరయు ♦ జంతుచయంబులఁ గాంచి
నెమ్మదిన్
జాలిజనింపఁ దాఁదపము ♦ సల్పి మతంబొకఁడుద్ధరించి లో
కాళిని జాటుబుద్ధుఁడు ద ♦ యామయ సత్యరతుండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 27

ఉ॥ బాలికపాళిఁగూలిచి ప్ర♦పంచమున న్నయధర్మతత్వముల్
పాలనసేసి తీర్థముల ♦ భక్తిఁజరింపగఁ గల్కిరూపముఁ
దాలుపఁబోవు భూరిగుణ ♦ ధన్యుఁడు మాన్యుఁడు చిన్ని వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంతరంగుఁడై 28

ఉ॥ తోలెను దుష్టదానవుల♦దొంగిలిమెక్కెను వెన్నముద్దలన్,
బోలెను మన్మథున్ విమల ♦ పూర్ణశశాంకుని ముద్దుమోమునన్,
లోలతవెట్టె నిట్టిగుణ ♦ లోకుఁడు లోకవిభుండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంతరంగుఁడై 29

ఉ॥ లీల జగంబుఁదివ్పచుఁ గు♦లీనుఁడునౌచు మలీమసాత్ములౌ
మాలుగుఁబోతులం గఱుకు ♦ మానిపి మాయకు దూరుఁడౌచు కీ
లాలరుహోప్తతేజుఁడగు ♦ లావరి దానవజేత వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంతరంగుఁడై 30

ఉ॥ ఢీలలితుండు భానుసమ ♦ తేజుఁడు, జారెడుజోడు జాళువా
శాలువవాఁడు, దివ్యఘన ♦ సారసుగంధ మరంద మల్లికా
మాలికఁగల్గువాఁడు, సుకు♦మారవిలాస తనుండు, వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంతరంగుఁడై 31

ఉ॥ శీలి, సుగంధపాత్రి తుల ♦ సీ నవపత్రి విరాజమాన, స
న్మాలి,మనోహరాంగ సుకు♦మారవిలాస కళాప్రపూర్ణతా
శాలి, కలాపమాళి, బుధ ♦ సన్నుత సద్గుణమూర్తి, వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 32

ఉ॥ క్రోలనుతించువారి ఘన ♦ పూర్వమహాఘ వితానమెల్లన
ద్వ్యోలయమాచరించి సుకృ♦తోదయమందగఁజేసివారల
మాలిమిఁజేసి ప్రోచు సుగు ♦ ణంబులుగల్గిన బాలవేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 33

ఉ॥ 'మాలలనాపతీ ! మకరి ♦ మామకపాదము పట్టిలాగ నేఁ
గోలుకొనంగలేను నినుఁ♦ గోరితిఁబ్రోవు మురారి!' యన్న
శుం
డాలముఁ గాచి నక్రము న ♦ డంచిన భక్తరతుండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 34

ఉ॥ లీలలఁజేయువాఁడు ముర ♦ లీదరహాసముఖుండు రాధికా
లోలుఁడు యోగిలోక సువి ♦ లోకుఁడు భక్తవరప్రదుం
డు సం
పాలితసర్వలోకుఁడు వి ♦ భాస యశోవిభవుండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తిమముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 35

ఉ॥ బాల, గుణాలవాల, నుత ♦ ఫాల, మనోహర కీరసార వా
గ్జాల, గభీరఘోర భవ ♦ సాగరతారణ ధీవిశాల, యా
నాలినురంబునందునిచి ♦ యాశ్రితరక్షణసల్పు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 44

ఉ॥ మౌళి మయూరపింఛమును, ♦ మౌక్తికముందననాసయందు, ముం
గేలనుఁగంకణంబులును, ♦ కింకిణులుం బదయుగ్మమందు, గో
పాలవిలాసినుల్ సకల ♦ పార్శ్వములందును, గల్గు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 45

ఉ॥ పూలును పిందె కాయలును ♦ బూర్ణఫలంబులు బల్లవంబులున్
జాలగఁగల్గిమల్లెలును ♦ సంపగి జాజి లతాదులెల్లెడన్
వ్రేలెడుకాననంబునఁ జ ♦ రించుచునాలనుమేపు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 46

ఉ॥ వాలుమెకంబులున్ శరభ ♦ వారణవాహ మృగేంద్ర ధేనురా
ట్కోలలులాయ ఖడ్గ కపి ♦ ఘూక బిడాలసృగాలయుక్తమౌ
శైలతటీవిహారమును ♦ సౌఖ్యముగా నొనరించు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 47

ఉ॥ పాలిత భక్తలోక శర ♦ పద్మము నాదల నుంచి ప్రేమచే
బాలకుఁడైన యాధ్రువునిఁ ♦ బ్రక్కకుఁజేర్చి సువర్ణపర్వతా
గ్రాలయమిచ్చి ప్రోచినమ ♦ హాత్ముఁడు వైభవదాత వే
ణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 48

ఉ॥ ఏలకొ? భూనివాసమది ♦ యేలకొ? శైలవిహారముల్ సదా
యేలకొ? మందలోన వసి ♦ యించుట గోవులమేపు టేలకొ?
లీలలుగాక యిట్టిశుభ ♦ లీలుఁడు శూలిసఖుండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 49

ఉ॥ 'బాలశిఖామణీ! దనుజ ♦ బాధలనోర్వఁగ లేము నొచ్చినీ
పాలనుజేరినారము కృ ♦ పన్ మముఁ బ్రోవక యున్నఁ జొత్తుమే
పాలిక, టన్న దేవతల ♦ ప్రాపయి రక్షణనల్పు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 50

ఉ॥ ఈలఘుగౌరవాద్యఖిల ♦ సృష్టియు మానవజంతుపక్షి వృ
క్షాలినుగీటకంబులు మృ ♦ గంబులు భూపశుపర్వతంబులున్
గాలము స్వస్వరూపములఁ ♦ గాఁగనుపింపుచునుండు వే
ణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 51

ఉ॥ శైలము దుమ్ముగా, రజము ♦ శైలముగా, హిమ మగ్నిగా, జ్వాల
తీ్కలల నీరుగాఁ, దృణముఁ ♦ దీవ్రపవీంద్రముగాఁ బవీంద్ర
ముఁ
బాలతృణంబుగాఁ దనదు ♦ భావముచేత నొనర్చు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 52

ఉ॥ చాలహితంబుగల్గి మన ♦ సావచసా తవదండనందగా
నాలము సేయఁబూనిన మ ♦ హాత్ములఁ బాండునృపాత్మజ
న్ములన్
బాలనసేసి కౌరవులఁ ♦ బాపి యధర్మమడంచు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయుదయాంత
రంగుఁడై 53

ఉ॥ ఆలినిఁ బాసి, పుత్రనిల ♦ యాదుల రోసి, ధనాళి వీడి, మి
త్రాళికి దూరుఁలై, యిహ ప♦రాశలనొందక బ్రహ్మమంచు నా
లోలతగల్గు యోగులకు * లోఁబడి పాలనసేయు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ * బాలనసేయుదయాంత
రంగుఁడై 54

ఉ॥ పాలనసేయుగాఁ, బృథివి * భారముఁదీర్పఁగ, దుష్టచిత్తులన్
గూలఁగఁజేయ, శిష్టులకుఁ * గోరిక దీర్ప, యశోదచేఁగట్టన్
బాలకుఁడై చరించుగుణ * భద్రుఁడు రుద్రసఖుండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మము * బాలనసేయుదయాంత
రంగుఁడై 55

ఉ॥ చాలవిశాలమానురము ♦ శాంతశుభాకృతి బద్మనేత్రముల్
బాలకరీంద్రయానము శి ♦ వంబగుభావము నీశ్వరత్వముఁ
వ్యాళశయానముఁ గరుడ ♦ యానముగల్గినయట్టి వేణుగో
పాలుఁడుకృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 56

ఉ॥ వేలునువేయుశీర్షములు ♦ విశ్రుతకర్ణముఖోరువక్షునా
సాలలితాక్షి పాదకర ♦ జాలము నెల్లను విశ్వరూపతఁ
వేలుగఁగల్గునానిగమ ♦ వేద్యుఁడనింద్యగుణుండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 57

ఉ॥ మీలనుఁబోలునేత్రములు ♦ మెల్లనిచూపులు ముద్దు
పల్కులుఁ
బాలదివాకరోపమ వి ♦ భాసురతేజము విద్రుమాభమై
క్రాలెడుసుందరాధరము ♦ గల్గి వెలింగెడు బాలవేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 58

ఉ॥ బాలుఁడుపీతిహాత్రనిభ ♦ భవ్యచరిత్రుఁడు భక్త
లోకముఁ
బాలనసేయువాఁడతికృ ♦ పాళుఁడు దివ్యగుణాలవాలుఁడా
శూలిసఖుండు నిత్యపరి ♦ శుద్ధవిశిష్టగుణుండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 59

ఉ॥ శూలినిమన్మథార్తిఁ గడు ♦ స్రుక్కఁగఁజేయు మనోహ రాంగియై
సోలుచు సొక్కుచు న్నడల ♦ సొంపునమేలగు వాలు చూపులన్
జాలభ్రమింపఁజేసి తన ♦ శక్తినివెల్లడిఁజేయు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత రంగుడై 60

ఉ॥ గాలిమెలంగెఁ బుట్టఁగనె ♦ గమ్మగఁజల్లఁగ, వహ్నియుజ్వల
జ్వాలఁజెలంగెఁ గుండములఁ ♦ జల్లునదుష్టుల గుండెలల్లక
లోలములాయె నిట్టిబుధ ♦ లోలమహామహిముండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత రంగుఁడై 61

ఉ॥ బాలికయోగమాయఁగని ♦ బాలిశుఁడాలరికంసురాజుతాఁ
గాలునుఁగేలబట్టి తన ♦ కన్నులనిప్పుకలుప్పతిల్లఁగా
నేలకులాగఁ బైకెగయు ♦ నేర్పననేరుపుకాఁడు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత రంగుడై 62

ఉ॥ బాలకుఁడౌచుఁబుట్టి నవ ♦ పల్లవపాణులకెల్ల ముద్దుగాఁ
జాలముదంబుఁ గూర్పఁగనె ♦ చంద్రముఖుల్ చెలరేగి నేతులన్
బాల వసంతమాడఁగని ♦ నవ్వుచువారినిఁజూచు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత రంగుఁడై 63

ఉ॥ బాలురఁ జంపనెంచి చనుఁ ♦ బాలవిసంబును సంతరించి గ
గ్గోలుగఁ బూతనాఖ్య యదు ♦ కుంజరుఁడా తనుఁ జేరి
వేగఁజ
న్బాలనొసంగఁ బ్రాణములఁ ♦ బాపినదుర్జనహర్త వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 64

ఉ॥ వ్రేలుపసిండితొట్ల నిదు ♦ రించుచునుండఁగ బండిరూపునన్
గాలనిబద్ధుఁడౌచు వడి ♦ గాఁజనుదెంచిన రాక్షసాధమున్
నేలఁబడంగఁదన్నిన వి ♦ నీతుఁడుసారబలుండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 65

ఉ॥ గాలిగరూపుఁగైకొనుచు ♦ గ్రక్కున రక్కసుఁ డుక్కు
మీఱి పెం
ధూళినిఁబ్రుంగఁజేసి సుడి ♦ తో గగనంబున కెత్తి నాతనిం
గూలిచి తల్లికిన్ ముదముఁ ♦ గూర్చినముద్దులకాఁడు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 66

ఉ॥ పాలనొసంగువేళ ముఖ ♦ పద్మమునందు నజాండమెల్ల జే
జేలను మర్త్య పక్షి మృగ ♦ సింధు రసాదులఁజూచి తల్లిమా
యాలవాఁడిమ్మనుంగ నగు ♦ టాలని తల్లినిఁ దేర్చు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 67

ఉ॥ శీలమనోజ్ఞ! కృష్ణ! యని ♦ చేరఁగఁదీసియశోద ప్రీతితోఁ
బాలునిఁదార్చి మోమునకుఁ ♦ బంగరుపాపటబొట్టుఁ గట్టుచున్
జోలలఁబాటఁబాడనగి ♦ చూచెడుసుందరమూర్తి వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంతరంగుఁడై 68

ఉ॥ బాలుఁడటంచుముద్దులిడు ♦ బామలఁబట్టుచు మోవినొక్కి కెం
గేలనుఁజెక్కు లన్నిమిరి ♦ గేలియొనర్చఁగభామలెల్లఁ జా
ల్చాలు గుణాఢ్య! యన్న నవ ♦ లామణులన్ గికురించు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంతరంగుఁడై 69

ఉ॥ కోలనుఁజేతఁబూనియొక ♦ కోమలిఁగ్రొంజడనావుదూడకున్
వాలమునందుఁగట్ట పద ♦ వారణయాన బిఱాన లేచి గో
పాల! యిదేమిరా యనినఁ ♦ బర్వులువెట్టుచు నేగు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంతరంగుఁడై 70

ఉ॥ లాలనమందుదోషబహు ♦ ళంబగుఁ దాడనమందు బాలకుం
డోలిగుణిత్వమొందునని ♦ యూహయొనర్చి యశోద కొట్టఁగాఁ
జాలభయంబునన్నతుల ♦ సల్పినబాలుఁడు ముద్దు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంతరంగుఁడై 71

ఉ॥ పాలకుఁబిల్లలేడ్వఁగని ♦ పాపమటంచువచించి రాత్రి గో
శాలనుఁజొచ్చి పాదముల ♦ చప్పుడొకిందు నెఱుంగ
కుండఁదా
నాలకుఁగ్రేపుల న్విడిచి ♦ యాడుచుఁ బాడుచుఁ బోవు
వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 72

ఉ॥ పాలును మీఁగడల్ పెరుఁగు ♦ బానలనుండఁగనట్లు
మీఁదఁ దాఁ
గేలిడ లేక నుట్లకును ♦ గ్రిందుగ రోలును బీటలెక్కి రం
ధ్రాలను వేసి జుఱ్ఱి త్వరి ♦ తంబుగ బోయినవాఁడు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 73

ఉ॥ పాలనుదాగి వెన్నదిని ♦ భాండములంబగులంగఁగొట్టి పెం
గోలదియొనర్ప గోపికలు ♦ గొట్టఁగవచ్చిన వెక్కిరించి చా
ల్పాలని మేలమాడుచును ♦ జయ్యనఁ బర్వెడు వాఁడు
వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 74

ఉ॥ బేలవునీవు వానిఁగని ♦ పెట్టఁగఁజాలవు పట్టుదేను చూ
డోలలనా! యటంచుసతి♦యొక్కతె బీరములాడుచుండనా
బాలకపోలచుంబనముఁ ♦ బ్రీతసల్పి మొరఁగు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 75

ఉ॥ పాలనుదొంగిలించెనని ♦ భామలుదల్లికిఁ జెప్పుచుండ నా
జోలియెఱుంగనట్లు విను ♦ చుఁగనుచుఁ భయమంది
కుందుచుఁ
మేలిగుణంబువానివలె ♦ మించునడంకువ నున్న వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 76

ఉ॥ బాలురఁగూడి యాలగుమి♦పాలఁజరింపయశోదపోయి యో
బాలక! చిన్నికృష్ణ! కొను ♦ పాలనటన్నఁబ్రియంబు
మీర న
ప్పాలను గ్రోలి తల్లికతి ♦ భక్తిమెలంగిన ముద్దు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 77

ఉ॥ తాలిమిలేకవత్సుఁడను ♦ దైత్యవరుండరుదెంచి మర్మమా
ర్గాలయుఁడైచుఁజేరఁజన ♦ నాతనినప్పుడు చూచివేడ్కతో
నాలుఁగుకాళ్లుపట్టి దన ♦ నట్టుదొలంగకకూల్చు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 78

ఉ॥ బాలుఁడువారానిలోక పరి ♦ పాలుఁడుదివ్యసుధాతిరమ్యవా
గ్జాలుఁడు సర్వసద్గుణ వి ♦ శాలుఁడుపాలిత శక్రముఖ్య ది
క్పాలుఁడు ధేనుకాసురవి ♦ భంజనదక్షుఁడుసామి వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 79

ఉ॥ మేలుఁగఁగోపకార్భకులు ♦ మెల్లగఁజెంతఁజరింపుచుండఁగా
నాలనుమేపువాఁడుదర ♦ హాసవికాసముఖాంబుజుండు వా
చాలుఁడు సాధుసన్నుతయ ♦ శస్కుఁడు వేదనుతుండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత రంగుఁడై 80

ఉ॥ కోలనుఁజేతఁబూనికడు ♦ కోపముతోఁడ యశోద దిట్టుచున్
ఱోలనుఁగట్టనట్టెచని ♦ రోదసిఘూర్ణిల నద్రులార్వఁగన్
సాలములన్ బెకల్చుబల ♦ సారుఁడుయక్షనుతుండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత రంగుఁడై 81

ఉ॥ మూలమెఱుంగలేక దను ♦ మోహితుఁ జేతునటంచు ధాత యా
య్యాలను బాలురన్ మఱుగు ♦ నం మునదాచిన యంతలో నఁ ద
ద్బాలకవత్సరూపములఁ ♦ దాల్చినవిశ్వమయుండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత రంగుఁడై 82

ఉ॥ బాలకమాత్రుఁడై భువిని ♦ భాసిలుఁగా నిపురందరాదిది
క్పాల మరుద్గణోరగ సు ♦ పర్వమహర్షులుయోగివర్యులా
మూలమెఱుంగలేనిగుణ ♦ పుంజవిభూషితుఁడైన వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత రంగుఁడై 83

ఉ॥ జాలములెల్లనేర్చి తన ♦ జాలమువారినిఁగూడి మందలోఁ
బాలుఁబెఱుఁగు మీఁగడల ♦ పారముగా భుజియించి గోవులన్
బాలనచేసినట్టి సుర ♦ పాలుఁడు మౌనినుతుండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంతరంగుఁడై 84

ఉ॥ కాళియనామధేయ భుజ ♦ గంబు ముఖస్ఫురితభూరితీక్ష్ణ కా
కోలమహోజ్జ్వలజ్జ్వలన ♦ ఘోరతరాహతిజంతుసంతతిన్
దూలఁగఁజేయఁదత్ఫణముఁ ♦ ద్రొక్కుచునృత్యమొనర్చు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంతరంగుఁడై 85

ఉ॥ పాలనసేయుమయ్య! నినుఁ ♦ బ్రార్థనసేతుము దావపావక
జ్వాలలనొచ్చినారము ప్ర ♦ శాంతియొనర్పు మటంచు వేడ నా
జ్వాలలమ్రింగిరక్షణము ♦ సల్పిముదంబొనగూర్చ వేణుగో
పాలుండు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంతరంగుఁడై 86

ఉ॥ ఆలనుమేపుచుండి మల ♦ యానిలపోతము సోకఁగా శర
త్కాలమునందుసవ్యనత ♦ కంఠముపందగ వేణుపూది జే
జేలునుతింప గానమునుఁ * జేసినమహానమూర్తి వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ * బాలనసేయు మనోహరాంగుఁడై 87

ఉ॥ బాలికలార! మీరలిటు ♦ వచ్చుటపాడియె? యుత్తమాంగనల్
బాలకులందఱ్యజించి నగుఁ ♦ బాటుగ బోటులు నర్ధరాత్రిరాఁ
బోలునె? యంచు ధర్మముల ♦ బోధయొనర్పవిధించు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత రంగుఁడై 88

ఉ॥ హేళనగాదెమీకిపుడు ♦ యేటివిలాసము కీర్తిదంబె యో
బాలికలార! మీమనము ♦ భక్తినిఁబొందిన యంతె చాలదే?
చాలవిచారమిద్దియని ♦ చక్కఁగ ధర్మముసాటు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత రంగుఁడై 89

ఉ॥ గోలతనంబుచేత నది ♦ గోయిదిగో యిటుఁజొచ్చెఁ గృష్ణుఁడం
చాలలితాంగులెల్ల విర ♦ హంబున నాయమునానదీమహా
కూలమునందు వారిజత ♦ గూడివిలాసమునల్పు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత రంగుఁడై 90

ఉ॥ ఓలలితాంగ! మమ్ముఁగన ♦ వో? కొనవో? మొరయాలకింపవో?
పాలనసేయవో? పరమ ♦ పాతకముల్ హరియింపవో? జగ
త్పాలక! యన్న గోపికల ♦ ప్రాపయిరక్షణసల్పు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత రంగుఁడై 91

ఉ॥ మేలిపసిండిపూతలను ♦ మించినమంచి మెఱుంగుటూగుటు
యాలల నూగుచేడియల ♦ హారములల్లలనాడి గాలిచేఁ
జేలములుందొలంగఁగని ♦ సీ! తగునాయనిదెల్పు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 92

ఉ॥ మేలములాడుచేడియలు ♦ మెల్లనఁజేర వనాంతరంబునం
దాలనుమేపుచుండి దర ♦ హాసవిలాస వికాసితుండు నై
యాలలనాళిఁగాంచి చను ♦ వారఁబ్రపన్నతఁదెల్పు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 93

ఉ॥ బాలికలైనగోపికలు ♦ వారివిహారము సల్పుచుండ గో
పాలురఁగూడియయ్యమున ♦ పాలికిఁబోయి రహస్యవర్తియై
చేలములన్ హరించియొక ♦ చెట్టునకెక్కిన దంట వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 94

ఉ॥ సాలమునెక్కితద్వసన ♦ జాలముదాచినదన్నుఁజూచి యా
బాలికలెల్లసిగ్గువడి ♦ వారితరంగల నుండలేక ద
త్పాలముఁజేర; వల్వల నొసంగి మమత్వముఁబాపు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 95

ఉ॥ ఓలలనాళులార! వినుఁ ♦ డోపికమీరఁగమీరుసేయు పూ
జాళికిదైవమెవ్వఁడు? య ♦ జాదులో? మారుఁడో? నేనో?
వేరుభూ

పాలురో? చెప్పవంచడిగి ♦ బంధురధర్మముఁదెల్పు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 96

ఉ॥ చేలవిహీనలై చెలులు ♦ సిగ్గుభయంబును స్వాభిమానముం
దోలిరటంచు నెంచి కడు ♦ తోషముతో శరణార్థిధర్మమా
కేలు మొగుడ్చుమంచు నగి ♦ కేవలతత్త్వముఁదెల్పు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 97

ఉ॥ ఆలను మేపుచుండి విక ♦ చాంబుజలోచనలేగి వేడిన౯
బాలరసాలసాలతల ♦ భాసురమై కదుఁజల్లనౌ నరి
త్కూలములన్ విలాసముగఁ ♦ గోరినధర్మము దెల్పు
వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 98

ఉ॥ తాళము వైచుగోప వని ♦ తాతతినంతన మొంద మోవితో
లీలఁగ వేణువూదుచు వి ♦ లీసవిలోచనుఁ డౌచు భ్రూలతల్
తాళలయానుసారము గ ♦ దల్పుచుఁద్రిప్పవినోది వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 99

ఉ॥ వ్రాలినప్రేమ గోపికలు ♦ వాంఛదలిర్పఁగఁగౌగలింప గో
పాలవధూవతంసకుచ ♦ భార మురమ్మునదాను బాసలీ
లాలసమానమానస వి ♦ లాసుఁ డనన్యశరణ్య వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 100

ఉ॥ శ్లీలవిచారతత్వపరి ♦ శీలవధూటులు వేడఁగా సరి
త్కూలవనాంతరంబున ని ♦ కుంజతలంబున చంద్రికా శర
త్కాలమునందుఁ గ్రీడలకుఁ ♦ దార్కొని సేవగ్రహించు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత రంగుఁడై 101

ఉ॥ బాలకుఁడయ్యుఁ బర్వతముఁ ♦ బాణినొకంటనఁ దాల్చి నిల్పఁగాఁ
జాలినవాఁడు సద్గుణవి ♦ శాలుఁడు చిన్మయుఁడవ్యయుండునా
నీలతనుండు నన్నిటను ♦ నేర్పరి తార్క్ష్యరథుండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత రంగుఁడై 102

ఉ॥ మ్రాలిమితోడగోపికల ♦ మానములెల్లనుఁజూఱఁగొంచు బ
ల్మేలుగ సంచరించుచును ♦ మెల్లగఁ జేరుచుఁ బిన్న చేష్టలన్
బాలకుఁడౌ త్రయీభువన ♦ పాలనదక్షుఁడుముద్దు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత రంగుఁడై 103

ఉ॥ ఏలకి జాజికప్పురము ♦ లెంతయునొప్పి సుగంధమైన తాం
బూలమునిచ్చి నిండుతమి ♦ బోటులునీటుగ మేటి నిల్వుట
ద్దాలనుఁజూపముద్దులిడి ♦ దార్కొని బ్రీతినొసంగు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి ♦ మముఁ బాలనసేయు దయాంత రంగుఁడై 104

ఉ॥ బాలురఁబంపి యమ్మునుల ♦ భార్యల నన్నముఁగోరినంజగ

త్పాలకుఁడైన బ్రహ్మమని ♦ వారుఁదలంచుచు భక్ష్య
భోజ్యముల్
మేలుగఁదెచ్చిపెట్ట నవి ♦ మెక్కుచు మోక్షమునిచ్చు
వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 105

ఉ॥ ఆలరికంసరాజొకశ ♦ శాసనయాగమటంచుఁ దెల్పి త
ద్బాలురరామకృష్ణులర ♦ థంబునఁదోడ్కొనిరమ్మటంచుఁదా
వైళమదూతనంప బల ♦ భద్రునితోఁ జనినట్టి వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 106

ఉ॥ జాలిదలిర్పనాద్రుపద ♦ జాసతిమానముఁగాచి యేలకో?
మాలిమిఁజేసి గోపికల ♦ మానముదోఁచె స్వతంత్రశక్తుల్
లీలఁగజూపువాఁడని వ ♦ రేణ్యులుసన్నుతిసేయు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 107

ఉ॥ చేలములిమ్మురా! రజక! ♦ చిత్రములైనన్నృపాంబరంబుల్
మేలగువానిఁగట్టుకొని ♦ మేమటుఁజొత్తుమనంగ వాఁడు నీఁ
బోలదటన్నవానిఁబొరి ♦ బుచ్చిభవం బెడఁబాపు వేణుగో
పాలుడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 108

ఉ॥ మేలగుపుష్పహారముల ♦ మిక్కిలిభక్తి వినమ్రయుక్తుఁడై
జాలఁగనియ్య వాయకుఁడు ♦ చక్కగవాని గ్రహించి
వానికిన్

శ్రీలనొసంగినట్టి సుర ♦ సేవ్యుఁడు చిన్మయమూర్తి వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ * బాలనసేయు దయాంతరంగుఁడై 109

ఉ॥ మాలలఁగట్టువాఁడు నృప ♦ మాన్యుఁడుభక్తుఁడు నొసు దామదా
సాలయమందుఁజొచ్చి సుమ ♦ హారమనోజ్ఞ సుగంధబృందతాం
బూలములందివానిఁ బరి ♦ పూర్ణమనోరథుఁజేయు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంతరంగుఁడై 110

ఉ॥ ఓలలనామణీ! యెవతె ♦ వో? కడుఁజక్కనిదాన వౌదు ముం
గేలసుగంధమా? యనుచు ♦ గేలినొనర్ప నఖండభక్తి నా
బాలిక కుబ్జగంధమిడ ♦ బాగని వక్రతఁబాపు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంతరంగుఁడై 111

ఉ॥ పూలునుబల్లవంబులును ♦ భూషణచందనధూపదీప తాం
బూలము లెల్లకాంతలిడఁ ♦ బూర్ణముదంబున వేగ నాధను
శ్శాలకునేగి యుంచుఁగల ♦ చాపముల న్విదళించు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంతరంగుఁడై 112

ఉ॥ చాలఁజలంబుగల్గిదను ♦ జంపఁగ నెంచినయట్టి గంసు ని
ర్మూలముఁజేసితద్భటుల ♦ ముఖ్యులనందఱఁజంపి వేగ జే

జేలజొహారులొందిన యు ♦ జేయమహా మహిముండు
వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 113

ఉ॥ కాలమునందుఁ జిక్కువడి ♦ కంసునిచేఁ జెఱసాలఁజేరి పే
రోలగమెల్లఁబాసి యెది ♦ యుఁగ మదిదోఁపనిబంధువర్గముఁ
జాలిదలంచి వేగఁ జెఱ ♦ సాలవదల్చిన వాఁడు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 114

ఉ॥ బాలకుఁడైనవేళ బల ♦ భద్రుఁడుదానును సాందిపార్యు వి
ద్యాలయమందు శాస్త్రముల ♦ నాగమసూక్తుల నెల్ల
యల్పకా
కాలములోన నేర్చిన వి ♦ కాసనుధీవిభవుండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 115

ఉ॥ సోలుచు సౌఖ్యచుఁ మిగుల ♦ సొంపుగఁబాడుచు
బ్రాహ్మణుండు జం
ఘాలుఁడుభైష్మి సంపునయ*ఖండరయంబున రాగవత్తి సే
మాలనుఁగోరినట్టి సుకు ♦ మారవిలాసతనుండు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 116

ఉ॥ శ్రీలలనాస్వరూపిణి సు ♦ శీల శుభాస్పద మైనరుక్మిణిఁ
గేల్పుగహించు వైభవము ♦ ఖేచరులౌనని మెచ్చముత్యముల్

ఫాలతలంబునందుఁదలఁ ♦ బ్రాలిడిహస్తమువట్టు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 117

ఉ॥ హేళనసల్పి రుక్మిణికి ♦ హీనతఁదోపఁగఁజేసి స్వాంతమున్
దూలఁగనాడియామె వగ ♦ తో దరిఁజేరి నుతింపఁబ్రీతితో
లాలనఁజేసి చందనము * లందివగన్ దొలగించు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుఁడై 118

ఉ॥ ఆలయమున్ రచించి తన * కయ్యెడఁబూజలు నిత్యభోగ
ముల్
గాలముదప్పకే జరుగఁ ♦ గల్పనచేసిన ధర్మకర్తకుం
జాలగనాయురున్నతులు ♦ సౌఖ్యధనంబులొసంగు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ ♦ బాలనసేయు దయాంత
రంగుడై 119

ఉ॥ శాళిరొనర్చిబంగరపు * పళ్లెరమందమునఁ బుష్పసంతతుల్
మాలికలుంచి కప్పురపు * మంగళహారతులిచ్చి భక్తిచే
ఖేలనమాచరింపఁదల * కించి ముదంబునుబొందు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ * బాలనసేయు దయాంత
రంగుడై 120

ఉ॥ చాలఁగఁదప్పులుండినను * జక్కగనుండిన నెట్టులున్న వా
చాలుఁడుఁజెప్పినట్టుగనె * సంతసమందిగ్రహించి గ్రంథ వా
గ్జాలము సత్పవిత్రముఁగ * సల్పిశుభంబులొసంగు వేణుగో

పాలుఁడు కృష్ణమూర్తి మముఁ * బాలనసేయు దయాంత
రంగుఁడై 121

ఉ॥ శ్రీలఁజెలంగువాని శుభ * శీలునిరాఘవరెడ్డి నామునిఁ
గూళతనంబులేని ఘన * కోటమరెడ్డికులాబ్ధిసోమునిఁ
జాలగధర్మకర్తను దయ * శంభొనగూరిచిప్రోచు వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ * బాలనసేయు దయాంత
రంగుఁడై 122

ఉ॥ బాలవిలాస కృష్ణగుణ * వైభవమీశతకంబు భక్తి మై
చాలఁగనెవ్వరేనియుని * శంబుఁబఠించినఁ బుణ్యకీర్తులం
దేలఁగఁజేయఁజాలిన సు * ధీనిధి మంగళదాతవేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ * బాలనసేయు దయాంత
రంగుఁడై 123

ఉ॥ మూలముబ్రహ్మ మంచుఁదల * పోసెనుజూటురు పద్మ
నాభ స
చ్ఛీలికుమారలక్ష్మి నర * సింహ ధరామరు నెల్లవేళలఁ
శ్రీలనొసంగిబ్రోచు శుభ * చిత్తుఁడుసద్గురుమూర్తి వేణుగో
పాలుఁడు కృష్ణమూర్తి మముఁ * బాలనసేయు దయాంత
రంగుఁడై 124

శ్రీవేణుగోపాల కృష్ణార్పణమస్తు

ఓం తత్సత్